# భక్త ప్రహ్లాదుడు

మూలం
పి.బి. చంద్రశేఖర్

అనువాదం
కేశవ

ప్రధాన సంపాదకుడు
ఎల్.ఎస్.శేషగిరిరావు

**భారత భారతి పుస్తకమాల**

3-4-852, కేశవనిలయం

బరకత్‌పుర, హైదరాబాద్-500027

ప్రచురణ కర్తలు

**నవయుగభారతి ప్రచురణలు**

పోస్ట్‌బాక్స్ నెం. 1041

నారాయణగూడా, హైదరాబాద్ - 500 029.

తెలుగు సంస్కరణ సంపాదకులు

**టి. హరిహర శర్మ**

*ప్రథమ ముద్రణ : నవంబర్, 2002*

**వెల: రూ. 8.00**

ప్రతులకు

**సాహిత్యనికేతన్**

3-4-852, బర్కత్‌పురా

హైదరాబాద్ - 500 027

ఫోన్ : 2756 3236

**సాహిత్యనికేతన్**

ఏలూరు రోడ్

విజయవాడ - 520 002

ఫోన్ : 2667421

# ఇది మా మాట

కేవలం భారతదేశంలోనే కాక, మొత్తం ప్రపంచంలోనే ప్రఖ్యాతులైన మన పూర్వీకులను స్మరించడం, వారి జీవితాలను అధ్యయనం చేయడం ఎల్లప్పుడూ ప్రేరణదాయకంగాను, మార్గదర్శకంగాను ఉండగలదనడంలో సందేహం లేదు.

మన చరిత్రకే వన్నెతెచ్చిన ఆ మహనీయుల జీవితాలను సరళమైన, ఉత్తేజకరమైన భాషలో ప్రజలకందించే చక్కని ప్రయత్నాన్ని రాష్ట్రోత్థాన పరిషత్, బెంగుళూరువారు ప్రారంభించారు.

"నవయుగభారతి" ఆ పుస్తకాలను తెలుగులోకి అనువదించే బృహత్కార్యాన్ని చేపట్టింది. భారత భారతి పుస్తకమాల రూపంలో మీ చేతుల్లో ఉన్న పుస్తకాలు ఆ ప్రయత్న ఫలితమే. మన చరిత్రలోని మహాపురుషుల జీవితాలు ఈ పుస్తక మాల ద్వారా మీకందించబడతాయి.

అమరమైన, అనంతమైన మన గత చరిత్ర అనే అమృత స్రోతస్సును తరువాతి తరానికి అందించగలుగుతున్నామనే సంతృప్తితో ఈ పుస్తకాలను మీముందు పెడుతున్నాం. మీరు కూడా ఈ కృషిని ప్రశంసించగలరని, ప్రోత్సహించగలరని ఆశిస్తాను.

మూలరచనను సరళమైన, ఆహ్లాదకరమైన రీతిలో తెలుగులోకి అనువదించిన అనువాదకులకు ధన్యవాదములు.

– హరిహరశర్మ
సంపాదకులు

# భక్త ప్రహ్లాదుడు

మహారాక్షసుడైన హిరణ్యకశిపునికి జన్మించిన పరమవిష్ణుభక్తుడు. కుమారుని భక్తి నుండి మరల్చడానికి తండ్రి ఎన్ని రకాలుగా హింసించినా తట్టుకొని నిలబడి తన అయిదవ యేటనే భగవంతుని సాక్షాత్కారం పొందాడు.

ఆ విష్ణుమూర్తే నృసింహమూర్తి అవతారంలో హిరణ్యకశిపుని వధించాడు.

ఒకానొక కాలంలో ఒక రాక్షసుడు ఉండేవాడు. అతడు బ్రహ్మదేవుడి గురించి తపస్సు చేసి బ్రహ్మ సృష్టించిన ఏ ప్రాణి చేతిలో తనకు మరణం కలగ నట్లుగా వరం పొందాడు. తనకు ఇంటి బయట లేదా లోపల మరణం సంభవించరాదని, రాత్రిగాని, పగలు గాని, ఆకాశంలో లేదా భూమి మీద, ఏ ఆయుధం వల్లకానీ, నరుడుగాని, జంతువు వల్లగాని మరణం సంభవించరాదని వరం పొందాడు.

ఇలా బ్రహ్మదేవుడి నుండి వరం పొందిన రాక్ష సుడు ఇక తనను ఎవరూ చంపలేరని, తాను అమరు డనని (మరణం లేనివాడు) అనుకున్నాడు. అతని అహంకారం పెరిగిపోయింది. చావు లేదు కనుక దేవ తలు కూడా తనను ఏమీ చేయలేరని వారిపై దండె త్తాడు. విష్ణువు పేరు వింటే ఆ రాక్షసుడికి ఎక్కడ లేని కోపం వచ్చేది.

అయితే బ్రహ్మ నుండి వరం పొందినా ఆ రాక్షసుడు తాను చేసిన తప్పులకు శిక్షను అనుభవించక తప్పలేదు. చివరికి అతడు మరణాన్ని తప్పించుకోలేక పోయాడు. అతని పేరు చెపితే భయంతో వణికిపోయే దేవతలు, మానవులు అతని మరణంతో ఊపిరి పీల్చు కున్నారు.

ముల్లోకాలను గడగడలాడించిన ఆ రాక్షసుడి పేరు హిరణ్యకశిపుడు. దేవతలు కూడా హిరణ్యకశిపు డిని ఏమీ చేయలేకపోయారు. కానీ ఒక చిన్న బాలకుడు తన నిర్మలమైన, అచంచలమైన దైవభక్తితో ఈ భయం కర రాక్షసుడి బారి నుండి లోకాలను కాపాడగలిగాడు. ఆ బాలకుడి పేరు ప్రహ్లాదుడు. ప్రహ్లాదుడి కథ చాలా ఆసక్తికరంగా వుంటుంది.

## గురువుల నుండి ఏం నేర్చుకున్నాడు?

శాంత స్వభావుడైన ప్రహ్లాదుడు ఒకరోజు

గురువుగారి కుటీరం దగ్గర ఏదో ఆలోచనలో అటు ఇటు తిరుగుతున్నాడు. 'ఎవరు మనకు మిత్రుడు? ఎవరు శత్రువు? అనే ప్రశ్నకి సమాధానం దొరకడం లేదు. ప్రహ్లాదుడి గురువులు చండామార్కులు. రాక్షస గురువైన శుక్రాచార్యుడి పుత్రులు వీళ్ళిద్దరు. ఇతర రాక్షస బాలకులతోపాటు ప్రహ్లాదుడికి కూడా విద్యా బోధన చేసేవారు. ప్రహ్లాదుడు వినయంతో, శ్రద్ధగా చదువు నేర్చుకునేవాడు. గురువులకు ప్రహ్లాదు డంటే ఎంతో ఇష్టం కూడా. ప్రహ్లాదుడు తమ రాజైన హిరణ్యకశిపుని కుమారుడు కావడంతో వాళ్ళు ప్రత్యేక శ్రద్ధతో ప్రహ్లాదుడికి చదువు చెప్పేవారు. హిరణ్యకశి పుడు అష్టదిక్పాలకులను ఓడించాడు. బ్రహ్మ నుండి వరాలు పొందాడు. హిరణ్యకశిపుని మిత్రుల, ఆదేశం మేరకు శత్రువులతో ఎలా వ్యవహరించాలో గురువులు బోధించారు. భగవాన్ శ్రీహరి సర్వవ్యాపి. సర్వజీవకోటి ఆయనలో భాగమైనప్పుడు మిత్ర, శత్రు భేదం ఎక్కడ నుండి వస్తుంది? భయం కూడా ఎందుకు?

ఇలా ఆలోచనలో మునిగి ఉన్న ప్రహ్లాదుడిని రాజభటులు వచ్చి రాజభవనానికి తీసుకు వెళ్ళారు. హిరణ్యకశిపుడు తన కొడుకును ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు. తన కుమారుడు ఏం నేర్చుకున్నాడో తెలుసుకోవాలనుకున్నాడు. ప్రహ్లాదుడిని ఒడిలో కూర్చో బెట్టుకుని ఇలా అడిగాడు – "నాయనా! నువ్వు గురువుల వద్ద ఏం నేర్చుకున్నావు?" ప్రహ్లాదుడు వెంటనే ఇలా సమాధానం చెప్పాడు – "తండ్రీ! ఒకరు నాకు మిత్రువని, మరొకరు శత్రువని వాళ్ళు చెపుతున్నారు. కానీ ఆ విషయం నాకు నచ్చలేదు. అందువల్లనే నేను అక్కడ హరిని ధ్యానిస్తున్నాను". ప్రహ్లాదుని మాటలు వినేసరికి హిరణ్యకశిపుడికి తన చెవులలో సీసం కరిగించి పోస్తున్నట్లు అనిపించింది. తన ప్రబల విరోధి అయిన శ్రీహరిని తన కొడుకు ధ్యానించడం ఏమిటి?

అయినా హిరణ్యకశిపుడు నవ్వుతూ తన కుమారుడికి వీడ్కోలు చెప్పాడు. చండామార్కులను పిలిపిం

చాడు. వాళ్ళు వచ్చిన తరువాత ఇలా అడిగాడు – "గురువులారా! మీ ఆశ్రమంలోకి ఎవరో శత్రువు ప్రవేశించాడు. ఆ శత్రువు నా కుమారుడి మనస్సులో హరి భక్తిని కలిగించి, విషాన్ని నింపుతున్నాడు. దయచేసి మీరు జాగ్రత్త వహించి ప్రహ్లాదుడిని సరైన దారిలో పెట్టండి".

## దండించవలసిందే

ప్రహ్లాదుడి ఇష్టదైవం శ్రీహరి అని తెలియగానే చండామార్కులకు భయం కలిగింది. ప్రహ్లాదుడిని పిలిచి – "నాయనా! అబద్ధం చెప్పకూడదని, నిజమే చెప్పాలని నీకు ఎవరు చెప్పారు? ఇక్కడ చదువుకునే ఏ రాక్షస బాలకుడికి ఇలాంటి ఆలోచన రానేరాదు. ఇవన్నీ నీకు ఎవరైనా నేర్పారా? లేక అవన్నీ నీ సొంత ఆలోచనలా?" అని అడిగారు. అందుకు ప్రహ్లాదుడు ఇలా సమాధానం చెప్పాడు – "గురుజనులారా! మీరేమంటు

న్నారో నాకు తెలియడం లేదు. నేను మిగిలిన బాలకుల వలె లేనన్నది నిజం కాదు. మీరు అడిగిన విషయాలను నేను స్వయంగా నేర్చుకున్నాను. నాకు ఎవరూ నేర్పలేదు". ఈ సమాధానం విన్న తరువాత చండామార్కులు ప్రహ్లాదుడిపై అన్ని ఆశలు వదులుకున్నారు. "నువ్వు రాక్షస జాతికే మచ్చ తెచ్చావు. శ్రీహరి మన శత్రువని నీకు తెలియదా? రాక్షస జాతిని నాశనం చేయాలని శ్రీహరి ప్రయత్నిస్తున్నాడు. మీ పిన తండ్రిని ఆ హరి సంహరించాడు". ఇలా అంటూ వాళ్ళు ప్రహ్లాదుడిని భయపెట్టాలనుకున్నారు. ప్రహ్లాదుడికి కొత్త విషయాలు చెపితే క్రమంగా శ్రీహరిని మరచిపోతాడని వారికి అనిపించింది. ప్రహ్లాదుడికి రాజ్యపాలన గురించి బోధించారు. శత్రువును శాంతియుత మార్గాల ద్వారా ఎలా లొంగదీసుకోవాలో చెప్పారు. సామదానభేద దండోపాయాలను ఎలా ఉపయోగించాలో నేర్పారు.

ఇవన్నీ నేర్పినా గురువులకు భయం పోలేదు. తమ రాజు దగ్గరకు తీసుకు వెళ్ళే ముందు ప్రహ్లాదుడిని అతని తల్లి వద్దకు పంపారు. ఆమె ప్రహ్లాదుడికి స్నానం చేయించి, సుందరంగా అలంకరించి పంపింది. తన వద్దకు వచ్చిన ప్రహ్లాదుడిని రాక్షసరాజు ఇలా అడిగాడు – "కుమారా! నువ్వు గురువుల దగ్గర నేర్చుకున్న అతి విశిష్టమైన విషయం ఏది?" – "తండ్రీ! చెవులతో శ్రీహరి పవిత్ర నామాన్ని వినడం, నోటితో ఆ నామాన్ని ఉచ్చరించడం, మనస్సులో శ్రీహరిని తలచుకోవడం, శ్రీహరి పూజ చేయడం, ఆయన సేవకు అంకితం కావడం – ఇవే నేను నేర్చుకున్న శ్రేష్ఠమైన విషయాలు".

ప్రహ్లాదుడి సమాధానంతో హిరణ్యకశిపుడు క్రోధంతో నిలువెల్లా వణికిపోయాడు. గురువులను పిలిపించి వారితో "మీరు నా కుమారుడికి అత్యంత నీచమైన, ప్రమాదకరమైన విషయాలు నేర్పారు. నా

శత్రువుతో కలిసి నా కుమారుడిని సర్వనాశనం చేశారు. మీకు నేనంటే భయం లేదు" అన్నాడు.

ప్రహ్లాదుడి గురువులు ఈ మాటలు విని వణికి పోయారు. వాళ్ళు భయపడుతూ – "మహారాజా! మమ్మల్ని క్షమించండి. మా పట్ల క్రోధం వహించకండి. ఇదంతా మేం నేర్పలేదు. తనంత తాను నేర్చుకున్నానని రాజకుమారుడు స్వయంగా చెపుతున్నాడు. మేము మీ శత్రువుతో కలిశామని భావించవద్దు" అని మొరపెట్టుకు న్నారు.

హిరణ్యకశిపుడి కోపం గురువుల నుండి ప్రహ్లాదుడి పైకి మరలింది – "ఓరి మూర్ఖుడా! ఇలాంటి అపవిత్రమైన మాటలు ఎక్కడ నుండి నేర్చుకున్నావు?" ప్రహ్లాదుడు నిర్భయంగా ఇలా సమాధానం చెప్పాడు – "నేను చెప్పిన దానిలో ఏదీ అపవిత్రమైనది లేదు. ఇవి నాకు ఎవరూ నేర్పలేదు. భగవంతుడైన శ్రీహరి కృప వల్ల నాకు ఈ జ్ఞానం లభించింది".




ఈ బాలుడ్ని తీసుకెళ్ళి చంపివేయండి

ఈ సమాధానం వినగానే రాక్షసరాజు కోపం రెట్టింపయ్యింది. "ఈ మూర్ఖ బాలకుడిని నా ముందు నుండి తొలగించండి. ఈడ్చుకుపోయి హతమార్చండి. శరీరంలో వ్యాపించిన రోగం ఎలాగైతే శరీరాన్ని నాశనం చేస్తుందో అలాగే ఇలాంటివాడు మొత్తం రాక్షస వంశాన్ని నాశనం చేస్తాడు" అని భటులను ఆదేశించాడు.

రాజాజ్ఞ విన్న భటులు కూడా ఆశ్చర్యపోయారు. అయినా రాజాజ్ఞను ఉల్లంఘించలేక వాళ్ళు ప్రహ్లాదుడిని అంతం చేయడానికి కత్తులు ఎత్తారు. ప్రహ్లాదుడు హరి స్మరణ చేస్తూ నిశ్చలంగా, నిర్భయంగా నిలబడి ఉన్నాడు. రాక్షసుల కత్తులు అతణ్ణి ఏమీ చేయలేకపోయాయి. ఇది చూసిన హిరణ్యకశిపుడు ఆశ్చర్యపోయాడు. "ఏనుగుల్ని తెచ్చి తొక్కించండి" అని ఆజ్ఞాపించాడు. ఈ ఆజ్ఞ విన్న వారంతా భయంతో మరింత

కంపించిపోయారు. కానీ ప్రహ్లాదుడి ముఖంలో భయపు ఛాయలు ఎక్కడా కనిపించలేదు. ఏనుగుల్ని తెచ్చారు. ద్వేషంతో నిండిపోయిన హిరణ్యకశిపుడి మనస్సు రాయిలా మారింది. ప్రహ్లాదుడిని ఏనుగులు తొక్కుతూ ఉంటే చూస్తూ, ఊరుకున్నాడు. ఏనుగులు సైతం ప్రహ్లాదుడిని ఏమీ చేయలేకపోవడం చూసి మరోసారి ఆశ్చర్యపోయారు.

తాను విధించిన కఠినమైన శిక్షలు ప్రహ్లాదుడిని ఏమీ చేయలేకపోవడం చూసిన హిరణ్యకశిపుడికి తన మీద తనకే కోపం కలిగింది. ఒక చిన్న బాలకుడిని శిక్షించలేకపోయాననే అవమాన భావం కలిగింది. ప్రహ్లాదుడిని నదిలోకి విసిరివేయమని ఆజ్ఞాపించాడు. కానీ ప్రహ్లాదుడు నదిలో మునగలేదు. హరినామాన్ని జపిస్తూ నీటిపై తేలుతున్నాడు. అది చూసిన హిరణ్యక శిపుడికి అసహనం మరింత పెరిగింది. ఎలాగైనా

ప్రహ్లాదుడిని హతమార్చాలన్న పట్టుదల కలిగింది. ప్రహ్లాదుడికి విషం ఇచ్చారు. కానీ హరినామామృతాన్ని ఆస్వాదిస్తున్న ప్రహ్లాదుడికి విషం అమృతమయింది. కొండల మీద నుండి తోసివేశారు. మంటల్లోకి విసిరివే శారు. ఇలా జల, వాయు, అగ్నులు ఏవీ ప్రహ్లాదుడిని బాధించలేదు.

"ఐదేళ్ళు కూడా నిండని ఈ బాలకుడికి ఇంత అద్భుతశక్తి ఎక్కడ నుండి వచ్చింది? విష్ణువు నా సోదరుడైన హిరణ్యాక్షుడిని సంహరించాడు. అలాంటి విష్ణువును నా కుమారుడు పూజించడం ఏమిటి? నేను ఏం చేయాలి?" ఇలా ఆలోచిస్తూ హిరణ్యకశిపుడు ఆందోళన పడ్డాడు.

## నారద మహర్షి నేర్పారు

చండామార్కులు రాక్షస రాజుకు ఇలా నివేదించారు - "మహారాజా! మూడు లోకాల్లో మీ ముందు

నిలువగలిగినవారు లేరు. మీరు మహాశక్తిమంతులు. అలాంటి మీకు ఈ చిన్న బాలకుని గురించి చింత ఎందుకు? కొద్ది సేపట్లో మా తండ్రిగారైన శుక్రా చార్యులు ఇక్కడికి వస్తారు. ఆయన ఈ బాలకుడికి హితబోధ చేసి అతని మనస్సు మారుస్తారు. పైగా ప్రహ్లా దుడు చిన్నవాడు. వయసు పెరిగినకొద్దీ సరైన విష యాలు నేర్చుకుంటాడు. అప్పటివరకు అతడిని మా వద్ద ఉంచండి" అన్నారు. రాక్షసరాజు వారి మాటలకు అంగీకరించాడు.

ప్రహ్లాదుడు తిరిగి గురువుల దగ్గరికి వచ్చాడు. రాజు ఎలా పరిపాలించాలి? శత్రువుల్ని ఎలా జయిం చాలి? అనేవి నేర్పుతున్నారు. కానీ ప్రహ్లాదుడికి ఈ విషయాల పట్ల ఏ మాత్రం ఆసక్తి లేదు.

ఒకసారి గురువులు పని మీద బయటికి వెళ్ళారు. రాక్షస బాలకులంతా ఆటకు ఇదే సమయమని

అనుకున్నారు. ప్రహ్లాదుడిని కూడా ఆడుకోవడానికి రమ్మని పిలిచారు. కానీ ప్రహ్లాదుడు వారితో – "మిత్రులారా! మానవజన్మ చాలా అమూల్య అవకాశం. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి. నిజమైన సుఖ సంతోషాలు పొందాలంటే చిన్నతనం నుండే శ్రీహరి స్మరణ చేయాలి. మన భక్తి విశుద్ధమైనదైతే భగవంతుడు ప్రసన్నుడై మనం కోరుకున్నది ఇస్తాడు. నారదముని ఈ విషయాలన్నీ నాకు చెప్పారు. ప్రస్తుతం మనం చదువుతున్న చదువుల వల్ల ఉపయోగం ఏమిటి? కేవలం కాలం వృధా చేయడమే అవుతుంది" అన్నాడు. ప్రహ్లాదుడి మాటలు విని రాక్షస బాలకులు ఆశ్చర్యపోయారు. ప్రహ్లాదుడు తమతోపాటే చండామార్కుల వద్ద చదువుకుంటున్నప్పుడు నారదుడి దగ్గర ఈ విషయాలన్నీ ఎపుడు నేర్చుకున్నాడు? "రాజకుమారా! నువ్వు ఎప్పుడూ మాతోపాటు విద్యని అభ్యసిస్తున్నావు కదా.

నారదుడి వద్ద ఈ విషయాలు ఎప్పుడు తెలుసుకున్నావు?" అని అడిగారు. మిత్రుల సందేహాన్ని తీర్చడానికి తన గతాన్ని వారికి చెప్పాలనుకున్నాడు.

"చాలా కాలం క్రితం నా తండ్రి తపస్సు చేయడానికై మందర పర్వతం మీదకి వెళ్ళాడు. రాక్షస రాజ్యంపై దండెత్తడానికి అదే అనువైన సమయమని దేవతలు భావించారు. రాక్షసులంతా కకావికలై నలుదిక్కులకు పారిపోయారు. దేవతలు రాజమందిరాన్ని దోచుకున్నారు. దేవేంద్రుడు నా తల్లి లీలావతిని బందీగా తీసుకువెళుతున్నాడు. నా తల్లి శోకిస్తోంది. నారద మహర్షి మార్గమధ్యంలో కనిపించారు. ఆయన దేవేంద్రుడితో "దేవేంద్ర! ఇదెక్కడి న్యాయం? ఇదంతా చేసే అధికారం నీకు ఉందా? ఆమె పుణ్యవతి అయిన స్త్రీ. ఆమెను ఇలా ఈడ్చుకుని తీసుకు వెళ్ళడం తగునా? ముందు ఆమెని విడిచిపెట్టు" అన్నాడు. అందుకు దేవేంద్రుడు "మహర్షీ! నాకు ఈమె పట్ల ఎలాంటి దురాలోచన

లేదు. ఈమె గర్భవతి అని నాకు తెలుసు. ఈమెకి పుట్టబోయే పుత్రుడు కూడా అతని తండ్రిలాగానే మనని కష్టాలు పెడతాడని భయపడుతున్నాను. అందుకే ఈమెను తీసుకువెళ్ళి పుత్రుడు జన్మించగానే వాణ్ణి వధించి అప్పుడు ఈమెను తిరిగి పంపుతాను” అన్నాడు.

నారదుడు నవ్వి ఇలా అన్నాడు - “మిత్రమా! నీకు అసలు సంగతి తెలియదు. ఈమెకి పుట్టే పుత్రుడు భగవంతుని భక్తుడవుతాడు. నువ్వు అతణ్ణి వధించలేవు. పైగా ఒక బాలకుడిని వధించడం దేవతల రాజుగా నీకు మంచిపేరు తెస్తుందా?” దేవేంద్రుడు నారదుని మాటలకు సిగ్గుపడ్డాడు. ఆ తల్లి పాదాలకు నమస్కరించి ఆమెను వదిలి పెట్టాడు. నారదముని ఆమెను తన ఆశ్రమానికి తీసుకు వెళ్ళాడు. ఆశ్రమంలో భాగవత ధర్మం, భాగవత భక్తుల మార్గాన్ని ఆమెకు ఉపదేశించాడు. నేను నా తల్లి గర్భంలో ఉన్నాను. నారదముని

నా తల్లికి చేసిన ఉపదేశాన్ని నేను కూడా విన్నాను. నా తండ్రి తిరిగి రాగానే నా తల్లి రాజమందిరానికి వచ్చింది. ఆ తరువాత నా తల్లి భాగవత ధర్మాన్ని గురించి మరిచిపోయింది. కానీ నా మనస్సుకు మాత్రం గాఢంగా హత్తుకుపోయింది. మీరు కూడా ఆ జ్ఞానాన్ని పొందవచ్చును అని ప్రహ్లాదుడు తన జ్ఞానరహస్యాన్ని తెలిపాడు.

ప్రహ్లాదుడి కథ విన్న తరువాత రాక్షస బాలకులకు భాగవత ధర్మాన్ని తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగింది. "భాగవత ధర్మం అంటే ఏమిటి?" అని అడిగారు. అది భగవంతుని కృపను పొందే మార్గం అని ప్రహ్లాదుడు వారికి చెప్పాడు. భగవంతుని కృపను పొందడానికి అనేక మార్గాలు ఉన్నాయి. కానీ వాటిలో ఇది సులభమైనది, ఉత్తమమైనది. ఎప్పుడూ భగవంతుని స్మరిస్తూ ఉండాలి. విశ్వమంతటా ఆయన నిండి ఉన్నాడని తెలుసుకోవాలి, ఆయన ఇచ్చ ప్రకారం నడుచు

కోవాలి. సజ్జనుల సాంగత్యం చేయాలి. దీనివలన మనకు శాంతి, సౌఖ్యం లభిస్తాయి. ఈ విషయాలన్నీ నారదముని నాకు చెప్పారు అని ప్రహ్లాదుడు చెప్పాడు.

ప్రహ్లాదుని మాటలు విన్న రాక్షస బాలకులంతా భాగవత భక్తులయ్యారు.

## వరాహావతారం

ప్రహ్లాదుడి వలన రాక్షస బాలకులంతా భాగవత భక్తులుగా మారారని తెలుసుకున్న చండామార్కులకు కోపం వచ్చింది. హిరణ్యకశిపుడి క్రోధం రెట్టింపయింది. ఇప్పుడు ఏం చేయాలన్నది వారిని వేధిస్తున్న ప్రశ్న. ప్రహ్లాదుడిని పిలిచి గురువులు ఇలా అన్నారు – "నువ్వు చేసిన పని బాగుందా? నీ తండ్రికి శ్రీహరి పరమశత్రువని నీకు తెలియదా? ఇదే శ్రీహరి వరాహావతారం ఎత్తి నీ చినతండ్రిని సంహరించాడని తెలియదా?"

'శ్రీహరి వరాహావతారాన్ని గురించి నాకు తెలియదు. ఒకసారి ఆ కథ నాకు చెప్పండి' అన్నాడు ప్రహ్లాదుడు. చండామార్కులు రాక్షస బాలకులందరికీ శ్రీహరి అవతారాల గురించి చెప్పారు. "హిరణ్యకశిప, హిరణ్యాక్షులు జన్మించగానే దేవతలంతా భయపడ్డారు. వాళ్ళిద్దరూ పెరిగి పెద్దవారవుతున్న కొద్దీ దేవతల భయం కూడా పెరిగిపోయింది. హిరణ్యకశిపుని తమ్ముడైన హిరణ్యాక్షుడు అధిక శక్తిశాలి. అతను దేవతల రాజ్యమైన స్వర్గలోకం మీద దాడి చేశాడు. హిరణ్యాక్షుణ్ణి ఎదుర్కొనలేక దేవతలు పారిపోయారు. సముద్ర దేవుడైన వరుణుడిని తనతో యుద్ధం చేయమని హిరణ్యాక్షుడు ఆహ్వానించాడు. కానీ వరుణుడు 'హిరణ్యాక్షా! నేను నీతో యుద్ధం చేయలేను. నీతో ఎవరు యుద్ధం చేయగలరు? భగవంతుడు మాత్రమే అందుకు సమర్థుడు' అన్నాడు. ఈ సమాధానం విన్న హిరణ్యాక్షుడు శ్రీహరిని వెతుకుతూ బయలుదేరాడు.




నరసింహస్వామి హిరణ్యకశిపుని వధించుట

"ఇదే సమయంలో పరమేశ్వరుని నాసిక నుండి ఒక వరాహం వెలువడింది. అది చాలా చిన్నగా ఉంది. కానీ క్రమక్రమంగా పెరగడం ప్రారంభించింది. అలా పెద్ద పర్వతంలా పెరిగింది. ఆ సమయంలో భూమి జలప్రళయం వల్ల నీటిలో మునిగి ఉంది. వరాహం తన ముక్కుపై నిలిపి భూమిని నీటి నుండి బయటకు తెచ్చింది. పర్వతాకారంలో ఉన్న ఈ వరాహాన్ని చూసి హిరణ్యాక్షుడు ఆశ్చర్యపోయాడు. అయినా అహంకారంతో ఇలా అన్నాడు – "భూమిని ఎక్కడ ఉంచాలో అక్కడ పెట్టి వెళ్ళిపో. నువ్వు ఎవరివో ఇప్పుడు నాకు తెలిసింది. నువ్వు వరాహరూపంలో ఉన్న శ్రీహరివి. నేను నీ అంతు చూస్తాను". ఇలా అంటూ హిరణ్యాక్షుడు వరాహాన్ని ఆపాలనుకున్నాడు. హిరణ్యాక్షుని మాటలు విన్న వరాహానికి కోపం వచ్చింది. "నీ అహంకారం వల్ల చావును కొని తెచ్చుకుంటున్నావు. యుద్ధానికి

సిద్ధంగా వుండు". యుద్ధం ప్రారంభమైంది. ఈ యుద్ధాన్ని దేవతలు చూస్తున్నారు. యుద్ధం రోజంతా జరిగింది. యుద్ధం చీకటి పడకముందే పూర్తి కావాలని బ్రహ్మ భావించాడు. ఎందుకంటే రాత్రి సమయంలో రాక్షసుల శక్తి పెరుగుతుంది. బ్రహ్మ భావించినట్లుగానే ఆది వరాహం హిరణ్యాక్షుని పైకి చక్రాయుధాన్ని ప్రయోగించడంతో అతడు చక్రాయుధపు దెబ్బకు మరణించాడు".

హిరణ్యాక్షుని కథ చెపుతూ చండామార్కులు ఎంతో బాధపడ్డారు. ప్రహ్లాదుడు మాత్రం ఎంతో ఆసక్తిగా కథను విన్నాడు. హిరణ్యాక్షుని మరణంతో అతని భార్యాపిల్లలు విచారంలో మునిగిపోయారు. మన రాజైన హిరణ్యకశిపుడు కూడా ఎంతో దుఃఖించాడని గురువులు చెప్పారు. "ఏదో ఒక రోజు అందరూ చనిపో వలసిందే. కనుక దుఃఖించడం అనవసరం. నా సోద రుడు వీరుడు. యుద్ధంలో వీరోచితంగా పోరాడుతూ

మరణించాడు. అలాంటి వీరుని గురించి దుఃఖించ కూడదు" అన్నాడు.

"అందరినీ ఓదార్చాడు కానీ హిరణ్యకశిపునికి దుఃఖం ఆగలేదు. శ్రీహరిపై గల ద్వేషం మరింత ఎక్కువ అయ్యింది. శ్రీహరి పేరు విషతుల్యంగా మారింది. శ్రీహరి పేరు చెపితే రక్తం ఉడుకులెత్త సాగింది. వెంటనే తన సేనానులైన ఇల్వలుడిని, సముచిని పిలిపించాడు. 'విష్ణుభక్తులను ఎంత వీలైతే అంత పీడించండి. విష్ణువును పూజించే వారందరినీ చంపి వేయండి' అని ఆదేశించాడు".

"ఈ ఆదేశంతో సేనాపతులు హరిభక్తుల్ని హింసించి, హతమార్చడం ప్రారంభించారు. దేవాలయాలను కూల్చివేశారు. వారి పరాక్రమాన్ని ఏమని వర్ణించగలం"– ఇలా చండామార్కులు రాక్షసుల వీరత్వాన్ని గురించి వర్ణిస్తూ ఉంటే ప్రహ్లాదుడికి విచారం కలిగింది.

రాక్షసుల దుశ్చర్యలను అంతం చేయాలనిపించింది. రాక్షసుల ప్రవృత్తిని మార్చాలనిపించింది.

## హిరణ్యకశిపుని వరం

చండామార్కులు కథను కొనసాగించారు. "హిరణ్యకశిపుడు మంథర పర్వతంపైకి వెళ్ళి ఘోర తపస్సు చేశాడు. ఒంటికాలిపై నిలబడి తపస్సు చేశాడు. అనేక సంవత్సరాలు గడిచిపోయాయి. అయినా హిరణ్యకశిపుడు కదల లేదు. అతని శరీరం నుండి తపః ప్రభావం వల్ల అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. అవి ప్రపంచాన్ని చుట్టుముట్టాయి. నదులు, సముద్రాలు మరుగుతున్నాయి. భూమి ఊగిపోయింది. దేవతలు భయంతో వణికిపోయారు. తమను రక్షించమని బ్రహ్మ లోకంలోని బ్రహ్మదేవుడికి మొరపెట్టుకున్నారు. అప్పుడు బ్రహ్మదేవుడు రాక్షసరాజు ముందు ప్రత్యక్షమై ఇలా అన్నాడు – 'హిరణ్యకశిపా! నీ తపస్సుకి, భక్తికి

మెచ్చాను. ఇంతకు ముందెన్నడూ ఇంతటి ఘోర తపస్సును చూడలేదు. నీకు కావలసిన వరం కోరుకో'.

"బ్రహ్మదేవుడు మంత్రజలాన్ని హిరణ్యకశిపునిపై జల్లాడు. దానితో అతని శరీరం బంగారంలా మెరిసిపోయింది. అప్పుడు హిరణ్యకశిపుడు "ఓ బ్రహ్మదేవా! నువ్వు ఈ అంధకారమయమైన జగత్తులో వెలుగునింపుతావు. నువ్వు సర్వశక్తిమంతుడివి, సర్వజ్ఞుడివి. దయామయుడివి. నువ్వు భక్తులకు త్వరగా ప్రత్యక్షమై, వారి కోరికలు తీరుస్తావు' అని స్తుతించాడు. హిరణ్యకశిపుని స్తుతికి ప్రసన్నుడైన బ్రహ్మ 'ఘోర తపస్సు ఎందుకు చేశావు?' అని అడిగాడు. 'నువ్వు ప్రసన్నుడవైతే నాకు ఒక వరం ఇవ్వాలి. నీచే సృష్టించబడిన ఏ ప్రాణి వలన నాకు మరణం కలగకూడదు. అలాగే ఇంటిబయట, లోపల, ఏ అస్త్రశస్త్రాల వలన, ఆకాశంలో, భూమి మీద నా మరణం సంభవించకూడదు' అని వరం కోరుకున్నాడు".

బ్రహ్మదేవుడు 'తథాస్తు' అన్నాడు. "రాక్షస బాలకు లారా! ఇప్పటివరకు మహా పరాక్రమశాలి అయిన రాక్షస రాజు కథ విన్నారు. ఇలాంటి మహాశక్తిమంతు డిని ఎదిరించగల దేవతలు ఉన్నారా? లేరు. హిరణ్య కశిపుడు మూడులోకాలకు రాజు. అలాంటి శక్తివంతు డైన, పరాక్రమశాలైన రాజును కాదని మీరు ఎందుకు కోరి ప్రమాదాన్ని కొని తెచ్చుకుంటున్నారు? వేరే ధర్మాన్ని పాటించాలని ఎందుకు అనుకుంటున్నారు?" అని చండామార్కులు ప్రశ్నించారు.

అప్పుడు ప్రహ్లాదుడు "బ్రహ్మదేవుడి నుండి వరాలు పొందినంత మాత్రాన దుష్టకర్మలకు పాల్పడవ చ్చునా? అలాంటి వారిని ఎవరూ శిక్షించలేరా? మహా విష్ణువు ముందు అందరూ తలవంచవలసిందే. ఆయన బ్రహ్మదేవుడికి కూడా స్వామి. ఆయన అందరినీ రక్షిస్తూ ఉంటాడు" అని సమాధానం చెప్పాడు. ప్రహ్లాదుని

మాటలకు రాక్షసబాలకులంతా తలలు ఊపారు.

ప్రహ్లాదుడి మాటలు విన్న చండామార్కులకు పరిస్థితి తమ చెయ్యిదాటిపోయిందని తెలిసింది. ప్రహ్లాదుడి మనస్సు మార్చలేమని తెలిసిపోయింది. వాళ్లు రాక్షసరాజు దగ్గరకి వెళ్ళి పరిస్థితిని వివరించారు. విషయం విన్న హిరణ్యకశిపుడికి కోపం వచ్చింది. ప్రహ్లాదుడిని పిలిపించాడు. ప్రహ్లాదుడిని చూడగానే హిరణ్యకశిపుడికి కోపం ఎక్కువైంది. "ఓరీ మూర్ఖ బాలక! నీ ఆలోచనలు ఇంకా మార్చుకోలేదా? నా చూపులకే ముల్లోకాలు గడగడలాడతాయి. కానీ నా పుత్రుడవైన నువ్వు మాత్రం నా మాట వినడంలేదు. నువ్వు చిన్నవాడివి. నీకు ఎవరో ఈ చెడు మార్గాన్ని చూపారు. నిజం చెప్పు నీకు ఈ చెడు మాటలు ఎవరు నేర్పారు?" అని గద్దించాడు. హిరణ్యకశిపుని కోపం చూసి అక్కడ ఉన్నవాళ్ళంతా భయపడిపోయారు. కానీ

ప్రహ్లాదుడు మాత్రం శాంతంగా "నాలో ఇంత ధైర్యం రావడానికి కారణం శ్రీహరి. ఆయన అందరికంటే శక్తిమంతుడు. ఆయనే ఈ విశ్వానికి ప్రభువు" అన్నాడు.

## స్తంభం నుండి వెలువడిన మహావిష్ణువు

ఎవరిని చూస్తే దేవతలు సైతం భయంతో వణికి పోతారో అలాంటి హిరణ్యకశిపుడి ముందు నిలబడి ఐదు సంవత్సరాల బాలకుడు ఉపదేశం ఇవ్వడం అందరినీ ఆశ్చర్యపరచింది. ప్రహ్లాదుడి మాటలకు తీవ్రమైన కోపంతో హిరణ్యకశిపుడు "మూర్ఖబాలకుడా! నీ చావు దగ్గర పడింది. నేను ముల్లోకాలకు రాజును. నన్ను మించినవాడు ఎవడు? ఎక్కడున్నాడు? చెప్పు" అని హూంకరించాడు.

ప్రహ్లాదుడు ఏ మాత్రం సంకోచించకుండా ఇలా సమాధానం చెప్పాడు - "ఆయన అన్నింటిలో ఉన్నాడు".

"ఏమిటీ? అన్నింటిలో ఉన్నాడా? ఈ స్తంభంలో కూడా ఉన్నాడా? ఉంటే బయటకు ఎందుకు రావడం లేదు. ఇప్పుడు నిన్ను నా కత్తికి ఎరచేయబోతున్నాను. నీ శ్రీహరి వచ్చి ఎలా రక్షిస్తాడో చూస్తాను" అని కత్తి దూసి ప్రహ్లాదుడి మీదకు ఉరికాడు.

అప్పుడే బ్రహ్మాండం బద్దలైనంత శబ్దం వచ్చింది. ఆ శబ్దానికి హిరణ్యకశిపుడు కూడా నిర్ఘాంతపోయాడు. అందరూ భయంతో చూస్తూండగానే స్తంభం రెండు ముక్కలై అందులో నుండి శ్రీహరి నృసింహావతారంతో వెలువడ్డాడు.

నృసింహుని శిరస్సు సింహం, మిగిలిన శరీరం మానవ శరీరం. విశాల శరీరుడైన నృసింహుని కళ్ళు మెరుస్తున్నాయి. అవి వజ్రాల వలె ఉన్నాయి. వెంట్రుకలు నిక్కబొడుచుకుని ఉన్నాయి. నాలుక చాచి ఉన్నాడు. ఆ నాలుక ఒక పదునైన కత్తిలా ఉంది.

చెవులు నిక్కబొడుచుకుని ఉన్నాయి. నోరు పెద్ద గుహలా ఉంది. శరీరం పర్వతంలా విశాలంగా ఉంది. ఆకాశవర్ణంలో ఉన్నాడు. పొడవైన బాహువులు ఉన్నాయి. నృసింహుని చూస్తే ఎవరికైనా భయం కలుగుతుంది.

ఇలాంటి భయంకర రూపంతో శ్రీహరి స్తంభం నుండి బయటికి వచ్చాడు. హిరణ్యకశిపుని సభ నిండి వుంది. అయినా ఏ ఒక్కరూ అటువైపుకి చూసే ధైర్యం చేయలేదు.

హిరణ్యకశిపుడు మాత్రం మొండి ధైర్యంతో నృసింహుని చూస్తున్నాడు. ఏం జరగబోతోందో అతనికి తెలిసింది. "ఓ! ఇతనేనా మహావిష్ణువు! వరాహ రూపంలో వచ్చి నా సోదరుని సంహరించినది ఇతడే. నేను ఈ విష్ణువుని అంతం చేస్తే ఇక దేవతలంతా దిక్కు లేని వారవుతారు. వేళ్ళు తెగిన వృక్షంలా కూలుతారు.

నా బలపరాక్రమాలు ఎంతో పరీక్షించుకుం టాను" ఇలా అనుకుంటూ హిరణ్యకశిపుడు నృసింహుని పైకి దూకాడు.

హిరణ్యకశిపుడు మహాశక్తి శాలి, సాహసవం తుడు. కానీ నృసింహస్వామి ముందు ఆ శక్తి, సాహసం ఎందుకు పనికి వస్తాయి? అతని పని కొండను ఢీకొన్న చీమలాగా అయ్యింది. నృసింహస్వామి హిరణ్యకశిపు డిని తన చేతుల్లో బంధించాడు. గరుత్మంతుని చేత చిక్కిన పాములాగా హిరణ్యకశిపుడు ఏమీ చేయలేకపో యాడు. భయంతో చేష్టలుడిగి ఉండిపోయాడు. నృసింహస్వామి గడప పైన కూర్చున్నాడు. హిరణ్య కశిపుని తన తొడలపై పడుకోబెట్టాడు. పదునైన తన చేతిగోళ్ళతో హిరణ్యకశిపుని పొట్ట చీల్చివేశాడు. పేగుల్ని బయటికి తీసి తన మెడలో దండలా వేసుకున్నాడు.

ఇదంతా సభలోని వారంతా నిశ్చేష్టులై చూస్తు

న్నారు. కొందరు తమ రాజు సంహరింపబడడం చూసి నృసింహుని పైకి వెళ్ళారు. ఆయన వాళ్ళందరినీ ఒక్క క్షణంలో పరలోకానికి పంపాడు.

ఇలా శత్రువులనందరినీ అంతం చేసి నృసింహ స్వామి సింహాసనంపై అధిష్టించాడు. దేవతలంతా ఆయనకు నమస్కరించి నిలబడ్డారు. గంధర్వులు శ్రీహరిని స్తుతిస్తూ గీతాలు ఆలపించారు. అప్సరసలు ఆనందంతో నృత్యం చేశారు. ప్రజలు కూడా ఎంతో సంతోషించారు. కానీ నృసింహుని కోపం మాత్రం తగ్గలేదు. సాక్షాత్తు లక్ష్మీదేవి కూడా ఆయన దగ్గరకి వెళ్ళే సాహసం చేయలేకపోయింది.

కోపంతో ఉగ్రుడైన నృసింహుని శాంతపరచడం ఎలా? అని అందరూ అనుకుంటున్నారు. అప్పుడు బాల కుడైన ప్రహ్లాదుడు భక్తిభావంతో ఆయన పాదాలకు సాష్టాంగ ప్రణామం చేశాడు. ప్రహ్లాదుని చూసిన

వెంటనే నృసింహుని కోపం తగ్గిపోయింది. ప్రహ్లాదుని పైకిలేపాడు. దేవతలంతా జయజయధ్వానాలు చేశారు.

బ్రహ్మదేవుడు హిరణ్యకశిపునికి ఇచ్చిన వరాలను నిలుపుతూనే హిరణ్యకశిపుని వధించాడు శ్రీహరి. హిరణ్యకశిపుని వధించిన సమయం ఇటు పగలు కాదు, అటు రాత్రి కాదు. సంధ్యాసమయమది. అలాగే వధించిన స్థలం ఇంటి లోపలా కాదు, బయటా కాదు. గుమ్మం మీద. ఆకాశంలో కాదు, భూమి మీద కాదు. తన ఒడిలో సంహరించాడు. అస్త్రశస్త్రాలను ఉపయోగించకుండా తన చేతిగోళ్ళతో పొట్ట చీల్చి చంపివేశాడు. ఆ విధంగా బ్రహ్మ ఇచ్చిన వరాలు వమ్ముకాని విధంగా శ్రీహరి హిరణ్యకశిపుని అంతం చేశాడు.

నృసింహస్వామిని చూసిన ప్రహ్లాదుడికి దుఃఖం మటుమాయమైంది. కళ్ళ వెంట ఆనందాశ్రువులు జారాయి. శ్రీహరిని చూసినంత మాత్రాన సర్వశ్రేష్టమైన

జ్ఞానం ప్రాప్తించింది. నృసింహ స్వామిని స్తుతిస్తూ "ఓ స్వామీ! నువ్వు దయామయుడివి. విశ్వసంరక్షకుడివి. దేవతలు కూడా నీ మహత్తును తెలుసుకోలేరు. అన్యాయాన్ని, అధర్మాన్ని నాశనం చేశావు. అయినా ఇంకా కోపంతో ఉన్నావెందుకు? శాంతుడవై నీ భక్తులను అనుగ్రహించు" అన్నాడు. ఈ మాటలు విన్న నృసింహుడు ప్రసన్నుడై "ఏ వరం కావాలో కోరుకో" అన్నాడు. ప్రహ్లాదుడు "స్వామీ! నాకు ఎల్లప్పుడూ నీ పట్ల శ్రద్ధ, భక్తి ఉండాలి. అలా నాకు వరం ఇయ్యి" అన్నాడు. శ్రీహరి తథాస్తు అన్నాడు. "ఇక్కడ కొంత కాలం రాజ్యాన్ని పాలించు. ప్రజలకి న్యాయం చేకూర్చు. తరువాత నిన్ను నాలో విలీనం చేసుకుంటాను" అని శ్రీహరి బోధించాడు.

## కథ వెనుక కథ

ప్రహ్లాదుని కథ అత్యంత ఆసక్తికరంగా వుంది కదూ? కానీ కథ వెనుక మరొక కథ వుంది.

హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు శ్రీహరికి ఆగర్భ శత్రువులెందుకయ్యారు? ఆ కథ ఇలా ఉంది-

"జయ, విజయుల్ని వైకుంఠపు ద్వార పాలకులుగా శ్రీహరి నియమించాడు. శ్రీహరికి దగ్గరగా ఉండడం వల్ల తమను మించిన వారెవరూ లేరనే గర్వం వారిని ఆవహించింది. ఒకసారి సనకుడు, సనందనాదుడు, సనత్కుమారుడు, సనత్ సుజాతుడు అనే నలుగురు మునిబాలకులు శ్రీహరి దర్శనార్థమై తమ యోగశక్తితో వైకుంఠానికి వచ్చారు. జయవిజయులు వారిని ద్వారం దగ్గర ఆపారు. లోపలకి వెళ్ళడానికి వీలు లేదన్నారు. దీనితో క్రోధితులైన మునిబాలకులు జయవిజయులను శపించారు. 'భగవంతుని దగ్గర ఉన్నా మీలో అహంకారం నాశనం కాలేదు. కనుక మీరు భూమిపై మానవులుగా బ్రతకండి' అని శపించారు. అప్పుడు జయవిజయులకు తాము చేసిన తప్పు

తెలిసింది. భయంతో వణికిపోయారు. శాపం గురించి శ్రీహరికి మొరపెట్టుకున్నారు. శ్రీహరి వారితో 'ఈ మునులు ఆత్మ సంయమనం, తపఃశక్తి కలిగినవారు. కనుక వీరి మాటలు నిజమవుతాయి. మీరు పరిపూర్ణ జ్ఞానాన్ని పొందేవరకు భూలోకవాసులుగా గడపండి. జ్ఞానాన్ని పొందిన తరువాత తిరిగి వైకుంఠానికి రావచ్చును' అన్నాడు. అప్పుడు జయవిజయులు అజ్ఞానం వలన మేము మిమ్మల్ని మరిచిపోతే మా గతి ఏమిటి? అని అడిగారు. వారి దుఃఖాన్ని చూసి జాలిపడి శ్రీహరి వారికొక మార్గం చూపాడు. "ఏడు జన్మలు నా భక్తులుగా భూలోకంలో గడుపుతారా? లేక మూడు జన్మలు నా శత్రువులుగా గడుపుతారా? నిర్ణయించుకోండి" అన్నాడు. వెంటనే జయవిజయులు "మేము ఎక్కువ కాలం మిమ్మల్ని విడిచి ఉండలేము. కనుక త్వరగా వైకుంఠానికి చేరుకోవడం కోసం మూడు జన్మలపాటు మీ శత్రువులుగానే ఉంటాం" అన్నారు.

"తరువాత జయవిజయులు భూలోకానికి వచ్చి పడ్డారు. వాళ్ళే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించారు. వాళ్ళు శ్రీహరిని శత్రువుగా భావించారు. శ్రీహరి వరాహావతారం, నృసింహావతారం ఎత్తి వారిద్దరిని సంహరించాడు.

వారే ఆ తరువాత త్రేతాయుగంలో రావణ, కుంభకర్ణులుగా జన్మించి శ్రీరామచంద్రుని చేతిలో మరణించారు. అలాగే ద్వాపరయుగంలో శిశుపాల, దంతవక్త్రులుగా జన్మించారు. వీళ్ళు శ్రీకృష్ణునితో విరోధించి ఆయన చేతిలో మరణించారు. ఆ విధంగా సనక సనందనాది మునుల శాపం నుండి విముక్తుల య్యారు".

ప్రహ్లాదుడిని ఆశీర్వదించి నృసింహస్వామి అంతర్ధానమయ్యాడు. తరువాత ప్రహ్లాదుడు సింహాసనాన్ని అధిష్ఠించాడు. ధర్మబద్ధంగా పరిపాలన సాగించాడు.

అతని రాజ్యం శాంతి సౌభాగ్యాలతో విలసిల్లింది. సద్గుణ సంపద వలన ప్రహ్లాదుడికి అపారమైన శక్తి చేకూరింది. ఇంద్రుని కూడా ఓడించి అతని రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపుకున్నాడు. రాజ్యం పోగొట్టుకున్న ఇంద్రుడు దేవతల రాజైన బృహస్పతి దగ్గరకు వెళ్ళాడు. ఆయనతో "గురుదేవా! సద్గుణ సంపన్నుడైన ప్రహ్లాదు డిని నేను ఏం చేయగలను?" అన్నాడు. అప్పుడు బృహస్పతి "ముక్తికి మార్గమైన జ్ఞానం అన్నింటికంటే ఉత్తమమైనది" అని సమాధానం చెప్పాడు. "అది సంపా దించడానికి మార్గం ఏమిటి?" "నువ్వు రాక్షస గురువైన శుక్రాచార్యుని దగ్గరకు వెళ్ళు. ఆయన నేర్పుతారు" అని బృహస్పతి వివరించాడు.

ఇంద్రుడు శుక్రాచార్యుని దగ్గరకు వెళ్ళాడు. ఆయన ఉత్తమమైన జ్ఞాన మార్గాన్ని ఇంద్రుడికి నేర్పాడు. ఆ తరువాత ఇంద్రుడు "ఇంతకంటే శ్రేష్టమైన

జ్ఞానం ఉందా?" అని అడిగాడు. "నిన్ను ఓడించిన ప్రహ్లాదుని దగ్గరకు వెళ్ళు. అతను నేర్పుతాడు" అని శుక్రాచార్యుడు సమాధానం చెప్పాడు.

## ఇంద్రుడు ప్రహ్లాదుని శిష్యుడయ్యాడు

శుక్రాచార్యుని మాటలకు ఇంద్రుడు ఆశ్చర్యపోయాడు. ప్రహ్లాదుడి దగ్గరకు వెళ్ళాడు. బ్రాహ్మణుని వేషంలో వెళ్ళిన ఇంద్రుడు ప్రహ్లాదుని రాజమందిరం బయట నిలబడ్డాడు. ప్రహ్లాదుడు అతణ్ణి ఆదరపూర్వకంగా సత్కరించి లోపలికి తీసుకు వెళ్ళాడు. అప్పుడు ఇంద్రుడు "ఓ రాక్షస రాజా! సర్వశ్రేష్టత్వం ప్రాప్తించే విషయమేమిటో దానిని నాకు ఉపదేశించు" అన్నాడు. "నేను మూడు లోకాలను పాలించడమే కాక, నా వ్యక్తిగత కార్యాలను కూడా చూసుకోవాలి. నీకు నేర్పడానికి సమయం లేదు" అని ప్రహ్లాదుడు సమాధానం చెప్పాడు.

అయినా ఇంద్రుడు వదల లేదు. “నీకు ఎప్పుడు తీరిక ఉంటే అప్పుడే నాకు ఉపదేశించు. సర్వశ్రేష్ఠ జ్ఞానాన్ని నీ నుండి పొందాలన్నదే నా కోరిక” అన్నాడు. ప్రహ్లాదుడు సరే అన్నాడు. అప్పటి నుండి ఇంద్రుడు ప్రహ్లాదుని శిష్యుడయ్యాడు. మెల్లగా జ్ఞానాన్ని సంపాదించాడు. గురువైన ప్రహ్లాదుడికి సకల సేవలు చేశాడు. ఇంద్రుని శ్రద్ధాభక్తులు చూసి ప్రహ్లాదుడు ప్రసన్నుడయ్యాడు. ఒక రోజు ప్రహ్లాదుడు ఆనందంగా ఉన్నప్పుడు ఇంద్రుడు ఇలా అడిగాడు – “మహారాజా! మీరు మూడు లోకాలను ఎలా గెలవగలిగారు? మీ విజయ రహస్యమేమిటి?” ఈ ప్రశ్న అడుగుతున్నది తన సామ్రాజ్యాన్ని తిరిగి సాధించుకోవాలనుకుంటున్న ఇంద్రుడని ప్రహ్లాదుడు గుర్తించలేకపోయాడు. అందువల్ల ఇలా సమాధానం చెప్పాడు – “ఓ బ్రాహ్మణోత్తమా! స్వచ్ఛమైన నడవడి వలన నేను మూడు లోకాలను జయించ

గలిగాను. కానీ నన్ను నేను ఎప్పుడూ పొగడుకోను. అలాగే అహంకరించను. శుక్రాచార్యుల సేవ చేస్తాను. పెద్దల ఆదేశానుసారం నడుచుకుంటాను. ఇంద్రియా లను అదుపులో ఉంచుకుంటాను. అందువల్లనే నాకు సర్వశ్రేష్ట స్థానం దక్కింది". తన శిష్యుడు సర్వశ్రేష్ట త్వాన్ని, పరిపూర్ణత్వాన్ని సాధించాలని ఉత్సాహపడుతు న్నాడనుకున్నాడు ప్రహ్లాదుడు. అందుకే అతనికి అలా చెప్పాడు. ఇంద్రుడిని ఏదైనా వరం కోరుకోమన్నాడు.

వెంటనే ఇంద్రుడు "ఓ రాక్షస రాజా! నా సేవలకు మీరు సంతుష్టులైతే మీ సచ్ఛీలాన్ని నాకు ధారపోయండి" అన్నాడు.

ఇంద్రుని కోరిక విన్న ప్రహ్లాదుడు ఆందోళన పడ్డాడు. తన సచ్ఛీలాన్ని ఒకసారి వదులుకుంటే దానితోపాటు శక్తిని కూడా వదులుకోవలసి వస్తుందని అతనికి తెలుసు. కానీ ఇచ్చిన మాటను జవదాటలేడు.



జీవితంలో అత్యున్నత శ్రేష్ఠత్వాన్ని ఎలా పొందగలం?

'తథాస్తు' అన్నాడు. ఇంద్రుడు అక్కడ నుండి వెళ్ళి పోగానే ప్రహ్లాదుని సద్బుద్ధి, వినయం, సదాచారం, శక్తి అన్నీ పోయాయి. అయినా ప్రహ్లాదుడు దుఃఖించ లేదు. శాంతమైన మనస్సుతో నృసింహస్వామిని తలు చుకున్నాడు.

రాక్షసపుత్రుడైనప్పటికీ ప్రహ్లాదుని విశుద్ధ భక్తి వల్ల శ్రీహరికి అతని ముందు ప్రత్యక్షం కావలసి వచ్చింది. అలాగే దేవతల రాజైన ఇంద్రుడికి ప్రహ్లాదుడి శిష్యుడిగా ఉండవలసి వచ్చింది.

దీనినిబట్టి ఏ కులంలో పుట్టామన్నది ప్రధానం కాదని తెలుస్తోంది. అలాగే ఎంత వయస్సు ఉందనేది కూడా ముఖ్యం కాదు. విశుద్ధమైన మనస్సు, నిష్కళంక మైన నడవడి ఉండాలి. ఇదే ప్రహ్లాదుని కథ మనకు ఇచ్చే సందేశం.

